## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

సంగీత

# శ్రీకృష్ణరాయబారము


గ్రంథకర్త

వి. యస్. మూర్తిగారు





ప్రకాశకులు,

ఈశ్వర బుక్కు డిపో,

[illegible] అచ్చియ్యా అండ్ [illegible] స్థాపితము 1885

ప్రొప్రయిటరు:- కిరాప్రి మావుళ్ళయ్య,

రాజమహేంద్రవరం.

1939




[వెల —12—0

# ఒక్క మాట.



భారతరామాయణ గాథల నెవరెన్ని రీతుల రచించినను తద్గ్రంధములందలి యభిమానాదరణంబులే కారణంబులని జగ మెరుంగనిది కాదు. కృష్ణరాయబారము లిదివరకు గొన్ని యున్నను నాభారతకథాభిమానమే యాగౌరవమే నన్నిందులకు బ్రోత్సహించినది. దానికి బ్రకాశకుల ప్రోత్సాహము తోడైనది. దీనియందు నాటకలక్షణాది దోషంబు లేవేని కొన్ని యుండిన చదువరులైన బుధవరులు తెలిపినచో సవరించుకొందును. ఈనాటకముయొక్క సర్వహక్కులును ప్రకాశకులకే చెంది యున్నవి. వారి యనుమతినంది ప్రదర్శకులాడుకొనవచ్చును. వారియనుమతిలేనిదే యెవరును ప్రదర్శింపరాదని వ్రాయుట నావిధి.

ఇట్లు,

బుధజనవిధేయుడు,

గ్రంధకర్త.

# ఈ నాటకమున వచ్చు ముఖ్య పాత్రలు.

## పురుషులు.

1 కృష్ణుడు
2 ధర్మరాజు
3 భీముడు
4 అర్జునుడు
5 నకులుడు
6 సహదేవుడు
7 దుర్యోధనుడు
8 కర్ణుడు
9 ధృతరాష్ట్రుడు
10 విదురుడు
11 భీష్ముడు
12 ద్రోణాచార్యుడు
13 కృపాచార్యుడు
14 అశ్వత్థామ
15 నారదుడు
16 భరద్వాజుడు
17 మహేంద్రుడు

## స్త్రీలు.

1 ద్రౌపది
2 గాంధారి
3 కుంతీదేవి

శ్రీరస్తు

సంగీత

# శ్రీకృష్ణరాయబారము.

—♦ నాంది ♦—

మ. శ్రీకృష్ణాయదుభూషణా నరసఖా ♦ శృంగారరత్నాకరా
లోకద్రోహినరేంద్రవంశదమనా ♦ లోకేశ్వరా దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా ♦ నిర్వాణసంధాయకా
నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ ♦ నిత్యానుకంపానిధీ

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి సభికులపై పూవులను జల్లి)

సూత్ర — ఆర్యమహాజనులారా! మీ రెల్ల రవ్యాజకృపాపరాయణులరై మాయందు దయయుంచి మాయాహ్వానమున కిచ్చట కరుగుదెంచిన మిమ్ము సంతోషపెట్ట తలంపున ధన్యతమంబైన శ్రీకృష్ణరాయబారనాటకంబును ప్రదర్శింపఁదలంచితిని గావున సావధానమతి నవధరింప వేడుకొనుచున్నాను. (సభలో కరతాళధ్వనులు కాఁగావినుట నభినయించి ప్రకాశముగా) ఆ? ఏమనుచున్నారు? గ్రంథకర్త యెవ్వరనియా? చిత్తము. చెప్పెద నవధరింపుఁడు.

గీ. పరమపావనంబైన నెం ♦ ప్రోలుగ్రామము
నందు పరిభవమందిన వాఁడు ♦ యవనిసురుఁడు
సూర్యనారాయణాఖ్యుఁడు ♦ సుజనహితుఁడు
బహుళసద్గ్రంథవిరచనా ♦ పారగతుఁడు.

(తెరలోనుండి)

ఆర్యా! లోన పాత్రవర్గము సంసిద్ధమై నాటకము ప్రదర్శింప వేగి రపడుచున్నారు. జాగుచేయక సభాస్తారులనుండి శెలవు గైకొని రండు.

సూత్రి—మంచిది. (సభికుల నుద్దేశించి) మహాజనులారా! సావధానముగా మాపరిదర్శన మాద్యంతము దిలకించి పరిమాదము లుజ్జగించి మంచి గైకొని మమ్మానందింపుడు.

(సభలో కరతాళధ్వను లగును.)

సూత్రి— చిత్తము. శెల వొసంగుడు. లోనికిపోయి పరిదర్శన మారంభింపింతును.

(అని నిష్క్రమించును.)

(తెరవాలును.)

—♦ ఇది ప్రస్తావన ♦—

---



శ్రీరస్తు.

సంగీత

# శ్రీకృష్ణరాయబారము.

## ప్రథమాంకము.



1 వ రంగము—ద్వారకానగరము బయలు.

( ప్రవేశము—అర్జునుడు. )

అర్జు:—(పరిక్రమించి) ఆహా! యేమి యీద్వారకానగర సౌం దర్యము వర్ణనాతీత మైనదిగదా!

(1 వ, అనుబంధము)

సీ. అల్లదే! ద్వారక నవ్య • హర్మ్యంబులు
చూడ్కికగపడు విందు • చూఱబెట్టె
అయ్యవే! నందనో • ద్యానవనంబులు
గనినంతసంతోష • కలన మించె
అవిగో! గవీబృంద • మావాసముల జేర
బోవుచుండుటజూడ • పొలుపు మిగిలె
రాధామనోహరు • రాజభవన మద్దె
కన్నులకైె కుంత • గరిమ హెచ్చె

గీ. వందిమాగధు లర్థిగో • పాలుని చంద్రి
“కృష్ణ గోపాల రాధికా • ప్రియ రమేశ
భోజకన్యామనోహర • భూరితేజ”
అనుచు పరమపుణ్యులుగదా • అవని వారు.

అహో! యేమి నాపూర్వసుకృతలాభము యెంతని గొనియాడ నగును. అతిజగత్కల్యాణకారణుడగు రుక్మిణీమనోహరుడు నాకు మేనమఱది యగుట నే నెంతయు ధన్యుడను ఆహా! యేమి నాయదృష్టము.

ఉ ఎట్టి తపంబు చేయబడెనో • నెట్టి చగతిమ్ము లమయ్యెనో
యెట్టి ధనంబు నర్థులకు • నిచ్చితినో వెలిబాముసందునా
యెట్టి పరాత్పరుని • నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టగరాని యీశ్వరుడు • బావగు టెల్ల మదీయ పుణ్యమా.

నేనిపుడు పోవునది మాకును కౌరవులకును జరుగనున్న భావి సంగరమున నా శ్రీకృష్ణుని సహాయ మపేక్షించి గదా? ఆతడు మాకు తోడు పడకుండునా? యేల పడకుండును. మున్ను మాకతడెట్టి సహాయములను గావించలేదు. విశేషించిన యీ యాయసదృశ కీర్తి వల్లిక కాతనిచేగదా దోహదము గాంచినది యాతని బంధువాత్సల్యముగాదా! భక్తవాత్సల్యము సరుషమానకుండదుగదా!

“సీ. ఎందిరా పోరాడి • పాలాక్షుడవ్వసి
ఫలమును నాకిచ్చె • పాశుపతము
ఎవ్వనిలావున • సిమ్మయి దవేంద్రు
పీఠార్ధమున నుండ • పెంపుగంటి
కాలకేయనివాత • కవచాది దైత్యుల
జంపితి నెవ్వని • సంస్మరించి

గోగ్రహణమునాఁడు ♦ కురుకులాంభోధి
గడచితి నెవ్వాని ♦ కరుణఁజేసి

ఆ. వె. 'కర్ణసింధురాజ ♦ కౌరవేంద్రాదుల
తలల పాగలెల్ల ♦ దడవి తెచ్చి
యేమహాత్ము బలిమి ♦ నిచ్చితి విరటుని
పుత్రి యడుగ బొమ్మ ♦ పొత్తికలకు.'

అట్టి మామకహృత్సైకపరాయణుఁడగు శౌరి నమ్మి కురుమహాసంగ్రామ సాగరమును డీకొని యుత్తరింపఁ గలుగుదునా? 'తినఁబోవుచు రుచి యడుగనేల' యన్నట్లు లోకింత సేపులో సర్వమును విదితముగాక యుండునా? (ఇంచుక తాళి) నాకన్న ముందుగా శ్రీకృష్ణుని సహాయము వేఁడుటకై మఱియు విరోధియగు దుర్యోధనుఁడు ద్వారకాపురము ప్రవేశించెనని యిదివరకే వినియుంటిని. ఒకవేళ నాకన్న ముందుగా నాతఁడు దర్శించెనని గోపాలు డాతనికి యభయహస్త మిచ్చునా? ఎట్లిచ్చును? మా యిరువురకుఁ గారణ మాతని పేరు కాదా? ధర్మము ఎరుఁగఁబడకుండునా? కానిమ్ము. పలుమాటలేల? సర్వము కొన్నిగడియలలోన తెలియఁగలదుగదా! (ముందుకుఁ బరిక్రమించి) అదిగో! రాజప్రాసాదము సమీపించితిని. నేనింక రాజభవన ప్రవేశము గావించెదను గాక!

(అని నిష్క్రమించును.)

2 వ రంగము—శ్రీకృష్ణుని శయనమందిరము.

(ప్రవేశము: శ్రీకృష్ణుఁడు పరుండియుండ దుర్యోధనుఁడు తలవంకఁ గూర్చొనియుండును.)

దుర్యో—(తనలో) నేను వచ్చి యిప్పటికే సుమారొక గంట కావచ్చినది. ఈ శ్రీకృష్ణుఁ డింకను నిద్రనుండి మేల్కొనలేదు. లేపినఁగో...

నిద్రాభంగ మగునని చింతింపవలసివచ్చినది. (విసువుచు) అబ్బా! పరాపేక్షవలన నెంతయవస్థ గలదు. నాయంతటి రారాజీ యదూద్వహుము లను, ఒక సామాన్యకృష్ణుని యాచింప వలసివచ్చినదిగదా? నాకీకృష్ణుడు సంపూర్ణముగ సహాయము గావించునను నుద్దేశమున వచ్చియుండలేదు. ఈతఁ డెప్పటికిని పాండవపక్షపాతియే! అయినను లోకుల కీతని పక్షపాతబుద్ధి చెల్లము గావింపవలయుననియే నే నిట్లు గావించితిని. (కృష్ణుని వపుజూచి) అదిగో! కృష్ణుడు కదలుచున్నాడు. ముందతడే నన్ను గాంచి కుశలప్రశ్నము సచిన తరువాతనే నేను ప్రత్యుత్తర మొసంగెదనుగాక!

కృష్ణు:— (కపటనిద్ర నటించుచు తనలో) ఈదుర్యోధనుడు నాసహాయ మపేక్షించి యరుదెంచినాడు. అర్జును డింకను రాలేదు. కారణ మవగత మగుట లేదు. (ఇంచుక తాళి) ఆ! వచ్చినాడు. మద్ద్వారసమీపభూమి కిప్పుడే వచ్చినాడు. పూర్వపరిచితు డగుట నందరను సమాధానపఱచి వచ్చుచున్నాడు. యీదుర్యోధనుడును నాయర్జునుడు నొక్కతరినే పురప్రవేశము గావించియున్నారు. కాని దుర్యోధను నెవ్వరింతగా నెఱిఁగినవారు లేకుండుటవలన త్వరితముగా నన్ను దర్శింపగలిగినాడు. క్షణమునకో యరక్షణమునకో నాతడును రాగలడు. అంతవరకు నే నిట్లు కపటనిద్ర నటించెదనుగాక!

అర్జు:—(ప్రవేశించి) అదిగో! అనుకొనినట్లదే దుర్యోధనుడు నాకన్న మున్నుగనే ప్రవేశించి యీగోపాలశేఖరుని తలయంపి నాసీనుఁడై యున్నాడు. (కృష్ణునివంకకు దరిసి) మాబావ శ్రీగోవిందుడు నిద్రించుచున్నాడు. నేనును పాదములచెంత వసించి యాతనిమేలుకువకై వేచి యుండెదనుగాక! (అని శ్రీకృష్ణునిపాదములచెంత నిలువబడును.)

కృష్ణు:—(నిద్రనుండి యర్జునునివైపునకు లేచి తొలుత యర్జును నిగాంచి ప్రకాశముగా) బావా! అర్జునా! నీవు వచ్చి యెంత సేపాయెను.

శా. బావా! యెప్పుడువచ్చినావు సుఖులే ♦ బంధుల్ హితవ్రాతమున్?
నీవల్ నీతురె నేవకావళి మిముల్ ♦ జిహ్మంబున న్నమ్మి మీ
రావంతైన విచారముం గనక బ్ర ♦ హ్మానందులై సోదరుల్
బావా! మాచెలియందున్ క్షేమవతులే ♦ పార్థా! వచింపంగదే!

(అని వెనుకకు తిరిగి దుర్యోధనునిచూచి ప్రకాశముగా) ఓహో శ్రీదుర్యోధనసార్వభౌములు విచ్చేసితిరే? ఎంతపరిమాదము సంభవించినది? తొలుత మిమ్ము జూడనైతినిగదా? బావా దుర్యోధనరాజా! నీవువచ్చి యెంత తడవైనది? నీవింతవఱ కెచ్చట నుంటివి? మనవారెల్లరికును క్షేమమేనా? పూజ్యుడగు ధృతరాష్ట్రమామకు సుఖమేగదా? పూజ్యురాలు గాంధారీయత్తకు కుశల మేనా? పెద్దలగు భీష్మ ద్రోణ కృపాచార్య అశ్వత్థామ, బాహ్లిక ముఖ్యులు సుఖంబుగా నున్నారా? విశేషము లేమి?

దుర్యో:— శ్రీకృష్ణా! మావారెల్లరును సుఖులై మహానందసందోహకందళితహృదయారవిందులై యున్నారు నీవు నారాకకు కారణం బడిగితివి. చెప్పెద నాలకింపుము.

గీ. మాకు నీధూర్తులకును ♦ స మరమ్మునచ్చె
ఇది చిరాగతమగుపాట నీ ♦ కెఱుకగాదె
నీవు మాయిరువురకును ♦ కెన్నివిధుల
నొక్కపోలిక గావున ♦ జక్క వినుము.

మాకు జరుగనున్న నీమహాయుద్ధమున నీసహాయము నపేక్షించి యిప్పుడే యొక్కగంటకుముందే యిచ్చటకు వచ్చి నీనిద్రాపరిసమాప్తి

కెదుట చూచుచున్నాను. నీవు విజ్ఞానసముద్రుడవు. ధర్మాధర్మము లెఱి
గిన మేటివి. న్యాయ మాలోచించి నిష్పక్షపాత ధర్ముఁడవు గమ్ము.

అర్జు:—

శా. బావా! యిప్పుడె వచ్చినాను సుఖులై ♦ బంధుల్ హితవ్రాతమున్
సేనల్ సేతురు సేవకావళి మముల్ ♦ జిహ్మమ్మునన్ సమ్మి మా
కావంతేని విచారము గలుగ నా ♦ సందప్రబోధార్థమై
బావా! నాయనుజన్ములుందురు సుఖ ♦ స్వాంబోష్పు మీవారికిన్
నావచ్చిన పనినిగూర్చి విన్నప మాలకింపుము.

గీ. ఈసుయోధనాదులు మమ్ము ♦ నెవరు లేక
గుడువనాస్ట్రి కష్టముల్ ♦ గూర్చువిధము
యెరుగనే నీవు నదియంత ♦ యిపుడు దాని
ఫలితఫలంబొచు సమరంబు ♦ వరుస గలిగె.

కావున ధర్మరహస్య మెఱింగి మాయిర్వురందు నొకిన్నైన యే
వాక ధర్మముగలదో ఎఱింగి వారికి సహాయుడవు గమ్ము.

కృష్ణ—పాణ్డు సుయోధనులారా! మీయిరువురు వచించిన పలు
కులను సావధానంబుగా వింటిని. ధర్మాధర్మములు విచారించుట కిది
యదనుగాదు. మీయిరువురును నాకు సమానమే కాని యిరువురకు
నిట్టివిషయమున సహాయము గావించుట పొసగనేరదు గదా? కావున
నే నొక్కవిధానము చెప్పెద. దానికి సమ్మతింపుడు.

అర్జు—అవశ్యము సమ్మతింతుము.

దుర్యో—నీయిష్టమైనట్టి ఏర్పాటునే గావింపుము.

కృష్ణ—అట్లయిన వినుడు.

క. 'నాపాటియ పదివేవురు
గోపాలురు గలరు సమర ♦ కోవిదబాహా

టోపాభిరామమూర్తులు
చాపాధ్యాయుధ కళా వి • శారదచిత్తుల్.'

కయ్యము చేయు నా నారాయణాభిధాను లొకవంక నుందురు. నేను నిరాయుధుండనై హితవ్యాపారమతినై యొకవంక నుందును. మీయిరువురందును యీపార్థుడు వయస్సున చిన్నవాడు గావున తొలు దొల్త నితండే కోరుకొనుట బాగుండును.

దుర్యో:—కృష్ణా! నీపక్షపాతమై జము మానవైతివి. మాయిరువురందును ముందు నేనుగదా వచ్చితిని. అట్టినాకు తొలుత గోరుకొనుట జెల్లునుగాని పార్థునకు జెల్లునా? యింత ధర్మము పరికింపనైతివి గదా?

కృష్ణు:—దుర్యోధనా! నీ వన్నది సత్యమే? అయిన నొక్క విశేషము గలదు చెప్పెద నాలింపుము.

"ఉ. నీవిట మున్న వచ్చితివి • నిక్కము పార్థుని దొల్త గాంచితిన్
గావున మీకు నిద్దరకు • గౌరవ మొప్పగ దోడుపాటు స
ద్భావము, దీనికిం దెలుగు • దప్పకయుండగ నేర్పరించితి
న్నీవలపెట్టి లట్ల తగు • నీయెడ పార్థుడుగోర శాణ్మణీ!"

దుర్యో:—సరే! కృష్ణా! నీయిచ్చ వచ్చినట్లనే గావింపుము. ఆమంచి చెడ్డలు నీకే గలుగగలవు.

కృష్ణు:—బావా! సుయోధనా! నాకుమాతళ్లియు యుద్ధాయుద్ధములు దెలియ వలెకొంటివా? పార్థా! నీవంతు గోరుకొనుము. సరిగ జెప్పెద. మరల నవగాహనము గావించుకొనుము. పెక్కుమంది మహావీరులును రణవ్యాపారపారీణులును, ధర్మవర్తనులు, స్వామిహితైక పరాయణులునగుగోపాలసైన్యవారధి యొక్కవంక, నిరాయుధుండనై యుద్ధము సేయని నే నొకవంక. యిం దేది లాభదాయకమో చింతించుకొని మరి గోరుకొనుము. మించిన పిదప విచారించిన లాభము లేదు.

దుర్యో:—(తనలో) ఈకృష్ణుడు తన్నుగోరక గోపాలసైన్యము గోరుకొమ్మను నుద్దేశమును సూచించుచున్నాడు. అన్నా! పక్షపాత మన నిట్టిదమనుగదా? కానిమ్ము. పర్యవసానమెట్లు కలుగునో పరికించెదనుగాక.

అర్జు:— బావా! నందనందనా? నీవు పరమాదరంబున గోరుకొమ్మనుటవలన నానందపయోరాశిం దేలియాడితిని. కావున గోరుకొనెదనుగాక.

గీ. విక్రమాటోపవరులైన ♦ వీరులైన
వివిధశస్త్రాస్త్రసంగర ♦ ప్రియులునైన
వలదు గోపాలబల మయ్య ♦ వాసుదేవ!
యీశ్వరా నీవు నా కుండ ♦ నితర మేల?

కావున నిన్నే కోరుకొంటిని. మీరుమాటాడక నామనోభీష్టంబు నెరవేర్పుము.

దుర్యో:— (తనలో) వహ్వా! నానోములు పండినవి. విజయసూచిక మిట్లగదా నుండవలయు (ప్రకాశముగా) కృష్ణా! అట్లైన గోపాలబల మంతయును నావశము గావింపుము. నాకు చాలతొందరపనులు గలవు. త్వరితముగా బోవలయును.

కృష్ణు:— సరే! అట్లనే గైకొందువుగాక! అగునుగాని యిప్పుడే పోవలయునా? భోజనము గావించి పోవలనుపడదా?

దుర్యో:— వలనుపడదు. నాకు చాలపను లున్నవి. మఱొకప్పుడు వచ్చినప్పు డొకపూటగాదు. సావకాశముగా బదిపూట లుండుచు నెమ్మి పోయెదను. (అని లేచి) సెలవా?

కృష్ణు—నీవట్లనిన నే నేమనగలను?

దుర్యో—కృష్ణా! నీవు మరియొకవిధముగా దలంచుకొనకుము. యీనారి వచ్చినప్పుడు తప్పక యుందువులే? (అని నిష్క్రమించును.)

కృష్ణు—బావా! అర్జునా!

క. 'నారాయణ గోపాలుర
భూరిపరాక్రముల గురువి ♦ భుడు నొన సంగ్రా
మారంభరహితు నన్నుం
గోరికొనుట నీవు మేల ♦ గున దలపోయన్?'

అర్జు—బావా! నందనందనా! నేను సహాయ మపేక్షించి నిన్ను గోరికొనుటలేను. వారి నుపేక్ష సేయులేదు. మాకెవ్వరిసహాయమును వలదు. నీవు మహానుభావుడవు. దివ్యప్రభావ సంపన్నుడవు. విజయమూలాంకూరమవు. నిన్నాదరించి విజయ మందుట నా కిష్టములేదు. యుద్ధము సేయుని నన్నేల గోరుకొంటి వందువేని. దానికి ప్రత్యుత్తరము చెప్పెదను వినుము. నీవు యుద్ధము చేసితివా ప్రసిద్ధంబగు యశము నీకే దక్కును గాని మావరకును రాదు కావున నీ వది సేయకుండుటయే నా కభిమతంబు. కావున నీవు నాయందు బ్రసన్నభావ మలంకరించి;

క. 'సారథ్యం బొనరింపు మ
పారకృపాలీల నెల్ల ♦ భంగుల నాకీ
గౌరవమును బరకాలము.
గోరెదయది దీని నిమ్ము ♦ గుణరత్ననిధీ!'

కృష్ణు—అర్జునా! నీయభిమతి మవశ్యము చేర్తును గాక! నీవు కోరినయట్లు నీకు రథచోదకుడనై సాధ్యమగునంతవరకు జయము నీకూర్చెదనుగాక!

అర్జు—బావా! కృష్ణా! ధన్యోస్మి! ధన్యోస్మి!

కృష్ణు—సరే! రమ్ము. వంటశాలకుం జని విందారగింతము. మనకై బలరామసాత్యకి ప్రభృతు లెదురు చూచుచుందురు. రమ్ము పోవుదము.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

(తెర వాలును.)

కృష్ణ:— యుధిష్ఠిరా! నీయభిమతం బేదియో చెప్పుము. తప్పక నెరవేర్తును.

ధర్మ:— అన్నా! ఈమహానీయుని యభిమతి మేమని నీ వడుగుచుంటివా? నేన చెప్పెద నాలింపుము. నిన్నగాక మొన్ననే సంజయుని మూలమున నాధార్తరాష్ట్రులకు సంధివిషయము రాయబార మంపినారు. ఆసంజయు డచ్చట నుండి వచ్చి "యాధార్తరాష్ట్రు లెన్నివిధముల ప్రయత్నించి చెప్పినను సంధి కయ్యకొనుట లేదు మీకు సామ్రాజ్యమున సాబాలు గావలసియున్న పోరు గావించి వారల నిర్జించి సుఖించునది. నా దందురేని మునుపటియట్ల కానల కరగి యాకలంబుల దినుచు నష్ట కష్టంబుల బడునది" యని వచించినాడు. యుద్ధంబు పైకి బుద్ధిపోక యీధర్మ సంభవు డిట్లు తల్లడిల్లుచుండె. తిరిగి వనవాసమున కిష్టపడుచుండెనేగాని యుద్ధమనిన నేమో నచ్చుట లేదు.

కృష్ణ:— ద్రుపదనందనీ! యాతనియభిమతి మాతనినోటనుండియే వచింప నిమ్ము.

ధర్మ:— గోపాలా! మే మాదుర్యోధనుని బంధుహిత పరిజనం[illegible]బుముందట నయిదూళ్ళ నిమ్మని సంజయునిమూలంబున రాయబార మంపినది సత్యమేకాని:—

'శా. ఆదుర్యోధను డంతమాత్రమును జే • యంజాలడో కాని పెం
దం బూత్రిరత నోర్వరాదు సిరి నా • కేలందు నే గ్రాసవా
సౌఖ్యంబులు వచ్చునా యరయు నీ • చుట్టాలకుం గావునన్
మోదం బందుట గల్గు గౌరవులునే • ముంబొంది శ్రీనొందినన్'

మఱియు

'ఉ. అక్కట లాతునైన బగ ♦ తైనను జంపన కోరనేల? గుం
డొక్కతెఱంగు లేదె యది ♦ యొప్పది బంధుసుహృజ్జనంబు లా
దిక్కుననున్నవారు గణు ♦ తింపక సంపదకై వధించి దూ
ఱెక్కుట దోషమందుటను ♦ నీదురవస్థల కోర్వవచ్చునే?'

కటకటా! క్షత్రియధర్మ మెంతకఠిన తరమైనది. కులధర్మము విడు వగుండవలెనన్న శస్త్రము పట్టితీరవలయుగదా? దానివలన బంధుహితా ప్తవర్గవినాశమును మనస్తాపమును సిద్ధించు. వంశనాశనము నా కిష్టము గాదు. కావున ధర్మగతి నీవు కౌరవులపాలికి బోయి సంధిప్రయత్నము చేయుము.

'చ. మనమున బక్షపాతగతి ♦ మానెనమానుము ధర్మనీతివ
ర్తనముల రెండుదిక్కుల హి ♦ తంబును, బెంపును గల్గునట్టిచో
ప్పున విదురాదిసజ్జనుల ♦ బుద్ధికి రా నుచితంబుతోడి మె
ల్పున బరుసందనంబునను ♦ భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ!'

ఓ శ్రేయోదాయకా! మాకు జుల్కదనంబుగాని తెఱంగున నెంత వినయముగా బల్కవలయునో నట్లు బల్కి యెట్టులైన నాసుయోధను నొప్పింపుము. మాయుభయ వంశంబుల గౌరవంబును గాపాడుము.

కృష్ణు:—ధర్మనందనా! నీనిశ్చితాభిప్రాయమునకు నామనం బమి తాశ్చర్యసంభ్రమములు గలిగించుచున్న దేల నందువా?

"మ. గురుభీష్మాదులు సూచుచుండ, సభ మీ ♦ కుం గీడు నాడష్టము
ష్కరులై చేసిరి యంతసేసియును బ ♦ శ్చాత్తాపమున్ బొందనో
పరు వారెన్నడు నట్టిచోట గృపయుక్ ♦ బంధుత్వముం దక్క మె
వ్వరు గోపింపరె యాదురాత్మకులగ ♦ ర్వక్రౌర్యముల్ సూచినన్."

కపటవర్తనంబు నెపంబుగా మమ్ముల వెడలనడుచునప్పుడు, దుర్యోధన దుశ్శాసన శకుని సూతనందనులు పుయిలోటదక్కి కలకల నవ్వచుం బలికిన పలుకు లుగ్గడింపవచ్చునే? వాని విని సమస్తజనంబులు ధృతరాష్ట్రుని నిందింపుచు, మీరు బలవంతులరై యుండియు, సత్యంబు పాటించి యూరక పోక చూచి, యుచ్చెంబుపాటించో నున్నమ్ములిం దుచుండిరి. అట్టివారంగ నోయెడివారు వెర్రిపాపులై మున్న చేసియుందురు గావున, వారలంజేయునపం జులకన. క్రూరాత్ముండగు కౌరవు లెల్లవారికిని వన్యులగుదురు. నాకు సవిస్తరంబుగా తెలియం బఱచితివి. నీకేల యుపధ్యులైరి. పాపాత్ముకులగు హింసకులా బామల నెట్లన్ని సర్వచారంబుగా వధించుట కర్తవ్యంబు. పోనిమ్ము నా కేమి? నీచెప్పిన వోప్పున నే గావించెద. గురుభీష్మద్రోణవిదురాదిపెద్దలముందర నీపనిచిన యర్థంబు విన్నవించెద. దానికి దుర్యోధను డియ్యకొనక మి మ్మొల్లను దూఱునాడు. దాని కావృద్ధులు వానికొల్లయునను సకది గాదని హితవు చెప్పగురు. దాని కాతండు నొక్కగొనడు. వృద్ధరాజు పుత్రవ్యామోహాము సంజేసి మారుమాటాడకుండు. గాన మన కేమిలాభంబు సిద్ధింపగలదు. ఏమైనను నేను నాకర్తవ్యము నిర్వర్తించెద. మీరలు మాత్రము చతురంగ బలంబులు సమకూర్చుకొని యుద్ధమునకు సన్నద్ధులై మాత్రముందుడు. (అని భీమునివంక నలసత్వముగా చూచును.)

భీము:—ఏమి శ్రీకృష్ణా! యుద్ధసన్నద్ధులు గమ్మని మమ్ము బెదరింపుచుంటివా? నిన్ను మాయన్న సంధికి బుత్తెంచుచున్నా డన్నంత మాత్రమున మే మంత పరాక్రమహీనులమని తలచితివా? కాదు. మా కాకౌరవుల నిశ్చితాసిపాతయు మెరుగజాలంది గాదు.

శా. పాపాత్ముండగు మదాంధు డాతులువ నీ ♦ పంపి ల్లనుం జేయగా
నోపం డప్పుడు సెప్పె దెవ్వరును మా ♦ నోద్రేకముల్ గర్వముల్

గోఁంబున్ దమదిశ్రిప్ప నా ప్రజనులం ♦ గుందించుటం బోయిన
శ్రేప్రోనిత్తురుగాన నిన్నతిఁడు జా ♦ లింబెళ్లెదుం జూడుమిా.'

మఱియు,

'ఉ. పాండవకౌరవుల్ గలసి ♦ పాలును నీరును బోలె నెమ్మనై
నుండగ దుష్టచేష్టల సు ♦ యోధను డింతులు సేసె నాత ఁడో
క్కండె కులక్షయంబునకు ♦ గారణ మం చెఱ్రిది తెల్ప దైన నీ
వాడనవేల యాబిరుగు నోపినయంతెయు ♦ గర్వునేర్చునన్.'

అదియునుంగాక మాకును వారికిఁ గూడ బితామహుండగు భీష్ముండు వినుచుండ నానుయోధనుతోడ నావచనంబులుగా నిట్లు బలుకుము.

'గీ. అన్నదమ్ముల కైయుండి ♦ యాకట మనల
నొరులు దలయెత్తిచూడ ♦ నొంగ గురులతోడఁ
బెనగనేటికి నీవేల ♦ బెద్దవారి
బుద్ధి విని పంచి కుడుమంట ♦ పోలదొక్కొ?'

అని యేవిధమునన్ నైసు వానికి నయభయంబుల నచ్చజెప్పి సంధి పొసంగించి మాయుభయ కులగౌరవంబులం గాపాడుము.

కృష్ణు:—

'ఉ. యుద్ధమువిూది వేడ్కయు మ ♦ హోగ్రవిరోధుల నల్కజేయు ద
ర్పోద్ధతియున్ సుయోధనుని ♦ యున్నతి సైనియేవు రాజ్యసం
సిద్ధి; నిజాగ్రజన్మునకుఁ ♦ జేయుతలంపును గల్గు నీవసం
బద్ధము లైన వాక్యములు ♦ వల్కుటగొప్పునె పంచకాంతకా!'

ఔరా! వెఱపెఱుంగని నీకు సహితత మిప్పట్టున ధార్తరాష్ట్రుల తోడి యుద్ధమనిన నెంతదిగులుపుట్టి పిరికివచనంబు లాడుచుంటివోయీ! బావా! వృకోదరా! నీ వింతటిభీరువవని తలంపనైతినిసుమా?

(అని నవ్వును)

భీము.—ఏమి మధుసూదనా! యేమనుచుంటివి? నేను భీరువు నటోయీ?

'ఉ. బంటుతనంబు మాటలకు బాఱదు ♦ పాండునృపాలు పాలు పైఁ
గొంటయచాలు నన్న నృప ♦ కుంజరుపల్కుల కడ్డమాడరా
కుంట యెఱుంగవే మును ను ♦ యోధనుచందముఁజూపి యప్పుడే
మంటి యుపేంద్ర! న న్ననిర ♦ ణాగ్రమునన్ విను మందలించెదన్.'

నాశక్తి యెరుంగక నీ విట్లు పలుకుదువా? ఔరా! యేమి నీపరిగల్భములు. నీవు నొకశూరుడవసియే తక్కట్లు మాకు దీర్పదలంచితివా?

సీ. గోపికాకాంతలఁ ♦ గూడి సయ్యాటలఁ
బొద్దుపుచ్చెదు నీవు ♦ పోడవగుదె?
గోపబాలురగూడి ♦ గోబృందముల్ గాన
మేవుచుండెదు నీవు ♦ మేటివగుదె?
వెన్నపాల్ మీగడ ♦ వేత్రలమందున
దొంగిలించెడి నీవు ♦ దొరవు నగుదె?
మాయజిత్తులు పన్ని ♦ మహితారివర్గంబుఁ
బరిమార్చిన ట్టీవు ♦ ప్రభుఁడ వగుదె?
గీ. చాలు! చాలూరకుండుము ♦ మేలు! మేలు!
మరచినాడవే యని బరి ♦ మార్చినట్టి

వారలను జరాసంధాది ♦ ప్రథితశూర
వరులసంగతి సుంతిలో ♦ నరయవలదె?

ధర్మ:—తమ్ముడా! భీమసేనా! శాంతింపుము. శాంతింపుము. నీక్రోధమున కిది సమయము గాదు.

భీ:—ఎందుల కీపనికిమాలిన శాంతి. తొలుత నుండియు నీశాంతియే మనల కింతలేసి ముప్పులకు గారణభూతమైనది.

సీ నాకు విషము వెట్టి ♦ యంబుల జేకాళ్లు
గట్టిదోయించిన ♦ కాలమందు,
కల్లజూదంబును ♦ గల్పించి మనకల్మి
సకలంబు పడదిన్న ♦ సమయమందు,
చెఱగుమాసిన కాంత ♦ చేలంబులను నిండు
సభలోన విప్పెడు ♦ సమయమందు,
అజ్ఞాతవత్సర ♦ మందున మనపైకి
దురముసేవచ్చిన ♦ తరుణమందు,

తే. శాంతమో శాంతమం చీవు ♦ సంతతంబు
చంపుకుని దిన్న కతనాన ♦ సంభవించె
యిపుడు వారితో యింతగా ♦ యిందుకులజ
మరల నాశాంత మేలయ్య ♦ మహితచరిత!
కావున నిక శాంతించుతు ననుమాట కల్ల?

అర్జు:—అన్నా! వృకోదరా! పూజ్యులమాట యతిక్రమింపజెల్లునా? మనవంటివారే యన్నమాట నతిక్రమింతుమేని లోకమున మరియన్నలమాటల విని ధర్మము నిలువబెట్టు వారుందురా? మరియొక్కటి?

తే. ప్రథిత వీరాధి వీరులౌ ♦ పాండుసుతులె
యగ్రజునిమాట నిరసింప ♦ యడవిలోన
మనల మంతంపు వార్లు ♦ మసల నేంచి
పల్కుచుందురు గావున ♦ వలయు క్షమము.

అదియునుంగాక మన కనేకోపకారములను గావించిన నీమధుసూదను నీకరణి తూలనాడ భావ్యమగునా? శాంతింపుము.

నకు:— అగ్రజా! బకాసురమర్దనా!

గీ. చిన్నతప మాదిమనల సే ♦ వెన్ని పెల్ల
భంగులను గాచి బ్రోచెడి ♦ వాడెకాద
అట్టిమేనమఱంది హా ♦ స్యంబుకొఱకు
పలికినట్టి పల్కులకీవు ♦ నలుగ నగునె?

సహ:— అన్నా! జరాసంధసంహారా! తమవంటివారికి నిట్టి తుచ్ఛకోపము గల్గునా! కావున శాంతి వహించి ముందు కర్తవ్య మాలోచింపుము.

ద్రౌప:— (దుఃఖము ప్రదర్శించుచు) అన్నా శ్రీకృష్ణా! వీర్యవంతమగు పాండవపంచకము పరాభూతమైనది. నాబన్నముదీర్పువా రెవరు? నాడు వాడుసభలో చెఱుగుమాసిన నన్ను వివస్త్రం జేయదలంచి నాశిరోజములువట్టి యీడ్చు దుశ్శాసనుండు లాగుతరి నూడిన నాయీశిరోజములు నేనాదుశ్శాసనుని రక్తముతోఁగాని ముడువనని ప్రతినజేయ నప్పుడేవృకోదరుండు నాదుశ్శాసనుని జంపి తద్రక్తమున నాశిరోజములను సవరించి ముడివేయింతునన్న ప్రతిజ్ఞావచనంబులు పటాపంచలైనవి. నాదుఃఖపరిసమాప్తి యెన్నడు కాగలదు. నే నింకెట్లు జీవింపగల్గుదును. (అని యేడ్చును)

కృష్ణు—అమ్మా! ద్రౌపదీ నీవించుక యూరడిల్లుము. సర్వము కాగలదిసవ్యముగానే కాగలదు. నడుమ నీవారలకు విచారింపకుము. వృకోదరా! నవ్వటాలకు నేనాడినమాటల కింత యలుక పడవలయునా? (భీమునితో) మంచిది మీయిచ్చవచ్చినట్లనే సంధికార్యము నడపివచ్చెదను. మీ మీసందేశములను తెల్పుడు.

ధర్మ—శ్రీకృష్ణా! యింక చెప్పుట కేమున్నది? సర్వము తొలుతనే యెఱింగితివిగదా? పెమ్మాట నీబుద్ధికి తోచినట్లు సంధినడపుము సాధ్యమగు నంతవఱకు శాంతముగా ప్రవర్తించి సంధియగు ప్రయత్నమాలోచింపుము.

కృష్ణు—వృకోదరా! నీ సందేశమది?

భీము—గోపాలా! నన్ను పదేపదే యేల రేకొల్పెదవు. నావచనములుగా నిండుసభలో నాసుయోధనున కిట్లు చెప్పుము.

గీ. ధర్మసంభవు వాక్యంబు ♦ దప్పకిచ్చి
సంధికేమిట్టు లాడబడు ♦ సమయమయ్యె
గానిచో నిన్ను మద్గదా ♦ ఘాతమునను
తొడలు పగిల్చి నీసర్వంబు ♦ దోచుకొందు.

కృష్ణు—మంచిది. అర్జునా! నీ వేమందువు?

అర్జు—నీకు చెప్పవలసినదంతయును పూజ్యులగు ధర్మసంభవ వృకోదరులు సెలవిచ్చియేయున్నారు. గావున సమస్తంబును నీకే వదలియగిలైదన నే నొకించుక చెప్పెద నాలింపుము వారలమున్న మాటల సంపన్నములు చాలవరకు నెరింగియున్నవారు గావున నీవు పోయినంతనె తప్పక సంధి కియ్యకొందురు నెంతదూరమో పోవ నేను చెప్పజాలను యుత్తరగోగ్రహణ సమయంబున వారు మనలావు పూర్తిగా గుర్తించియున్నారుగదా? ఎట్లన—

ఎంతటిమహోన్నతజీవికకు నాయుట్టిదానికి యెంతటిభంగపాటు సంగటిల్లినది.

చ. వరమునఁ బుట్టితిన్ భరత • వంశముఁజొచ్చితి నందు బాండుభూ
వరులకు గోడలైతి జన • వంద్యుల బొందితి నీతివిక్రమ
స్థిరులగు పుత్రులం బడసి • తిన్ సహజన్ములప్రోవు గాంచితిన్
సరసిజనాభ యిన్నిటఁ బ్ర • శస్తి నెక్కినదాన నెంతయున్.

రాధామనోహరా! నీవు నన్ను సుభద్రకన్న నెక్కుడుగా మన్నించువాఁడ వగుటంజేసి నా బన్నంబుల నొకించుక స్మరణకు రా నివ్వవలసినది. ఆనాఁడు దుర్మార్గులు చెలఁగుమాలిన వనితనైనను భావింపక కేశముల పట్టి సభకీడ్చించి నానాగావిలిచేఁ బరాభవమునకు నీకృప లేకున్న మానభంగము గావించినదే కదా? అట్టి సమయమందైన నీపాండవేయు లసమర్థులవలె మిన్నకుండుటయు నా ప్రారబ్ధంబు. ఛీ! ఛీ! యిట్టి పౌరుషవచనంబులు నామీఁద నుండుటకంటె వెడలుటయే శోభాయమానము గాఁగలదు. (అని యేడ్చుచు కృష్ణునకు దన చిక్కువారిన కురులు చూపుచు) అన్నా! నందనందనా! యీ నా కురులు దుస్ససేనుని కరాఘాతపీడనంబునం జేసి సగసగంబు తెగిపోయి యున్నయవి. ఇవి యెన్నండు దిరిగి తదీయమేని రుధిరధారాప్లవంబునఁ గాని మొలకలెత్తి యభివృద్ధిం గాంచ జాలవు. మఱియును.

సీ. ఈవెండ్రుకలు పట్టి • యీడ్చిన యాచేయి
తొలుతగా బోరిలో • దుస్ససేను
తను వింత లింతలు • తునియలై చెదరిరూ
పేఁ యున్నఁ గనియెదు • కాదుగాక
యలుపాలఁ బొనుపడు • నట్టిచిచ్చే యిది
పెనుగద పట్టిన • భీమసేను

బాహుబలంబును ♦ బాటించి గాండీవ

మను నొకవిల్లెప్పు ♦ డునువహించు

ఆ.వె. క్షత్రియకర్మంబుఁ ♦ గాల్చనే యిట్లు బ

న్నములు వడిన ధర్మ ♦ నందనుండు

నేను రాజరాజు ♦ పీనుంగు గన్నార

గానఁబడయ నైతి ♦ నేని కృష్ణ!

ఉ. నెట్టన యట్టియల్క మది ♦ నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చిడిం

గట్టినయట్లు పెద్దయును ♦ గాలము దీనికి నాలు గెన్నఁడుం

బుట్టదు దుష్టనిగ్రహము ♦ పూని జగంబులు గాచునట్టియో

బుట్టవు నీవు దేజమున ♦ బొల్చిన భర్తలు గల్గ నచ్యుతా!

(2 వ అనుబంధము)

(అని వెక్కి వెక్కి యేడ్చును)

కృష్ణు:—(ద్రౌపది నూరార్చుచు)అమ్మా! విచారింపకుము.

ఉ. ముచ్చిరనేల యేఁ గలుగఁ ♦ ముద్దియ నాకు వృకోదరుండు వి

వ్వచ్చుడు దోడురాగ జన ♦ వద్యుడు ధర్మసుతుండుపంప నే

మెచ్చగ శత్రుసంక్షయము ♦ మేకొని చేసెదగాక నీశోకం

డచ్చుపడంగ నేర్చునె దు ♦ రాత్మలు కౌరవు లుర్వి యిత్తుగే?

కావున నాపల్కుల నాదరించి యూరడిల్లుము. మేరువు దలక్రిం దైనను నాచెప్పిన చొప్పు తప్పక కాక మానదు మఱియు.

గీ. పూని పల్కెద వినుము రి ♦ పుక్షయంబు

జేసి యుజ్జ్వలపుణ్యాల ♦ క్ష్మీసమేతు

లైన పాండుకుమారుల ♦ యధికవిభవ

మీవు చూచెదు తడవు లే ♦ దిదినిజంబు.

జగంబున గలవారలు నన్ను పాండవపక్షపాతిగాక ధర్మపక్షపాతి యనుట శ్రీధర్మజునిపంపున కంగీకరించితినిగాని వేరొండు గాదు. కావున చింతదక్క సుఖంబుండుము. నేను పోయి వచ్చెదను

(అని నిష్క్రమించును.)

(తెరవ్రాలును)





# సంగీత
# శ్రీకృష్ణరాయబారము

## తృతీయాంకము.



### 1 వ రంగము—కౌరవదర్బారు.

(ప్రవేశము గాంధారితో ధృతరాష్ట్రుఁడు, భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ విదుర, దుర్యోధన, కర్ణ జమదగ్నులు.)

కృష్ణః—మామా! కురుభూపాలాగ్రణీ! నేను శ్రీకృష్ణుడను; పాండవుల పాలినుండి దౌత్యము నెఱపవచ్చితిని. నీ వెఱుంగనిధర్మంబు లెందు గలవు. సోదరన్యాయమున పాండవకౌరవులు పరమస్నేహంబున ప్రవర్తించుట యుభయవంశములకును శ్రేయోదాయకము. మఱియు,

చ. భరతకులంబు ధర్మమును ♦ బాడియు సత్యము పొత్తు పెంపునుం
గరుణయుఁ గల్గి యుండునన ♦ గా నుతిగన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుగు ♦ దమ్ముఁడు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలురీ సుచరి ♦ తక్రమ మిప్పుడు దప్ప నేటికిన్.

పాండవుల దురదృష్టమునం జేసి పాండుభూవిభుఁడు దివంగతుఁ డైనాడు. కావున నీవు వారి కెప్పుడు తండ్రియంతటివాఁడవు. నీయుభయసంతతులవారు నేకారణముననైన సరే పొత్తువాసి కయ్యముసేయ నుంకించితేని యాయపఖ్యాతి నీకే చెందగలదు. కావున,

ఉ. కౌరవ పాండవుల్ తెలుఁగు ♦ గైకొని శాంతతఁ బొందియున్కి మే
లారయ నాకు నీకుఁ గుల ♦ మంతకు నీనృపకోటి కుర్వికిం
బోంతమైన వి తకును ♦ చుట్టు మహాపద గావునన్ ధరి
త్రీ రమణాగ్రగణ్య గణు ♦ తించి యవశ్యము బొం దొనర్పవే?

కాక మిన్నక యూరకుంటివా యుభయకులంబులవారి కవశ్యము బోరుగాఁగలదు నట్టివో

ఉ. అందు వృకోదరార్జునుల ♦ నాహవరంగమునందు మీరు వా
రెందఱో యెన్నుమా యిచట ♦ నీగురుభీష్ములఁ గ్రోణిసేయువా
రెందఱో వారు వీరు నని ♦ నీల్గుటకింటు భవద్బలంబులై
యందరు గూడు గొప్పదె జ♦నాధిప శాంతియొనర్పు మెమ్మెయిన్.

ఈరెండుపక్షంబుల నెవ్వరికిని సంకటంబైన నీక దుఃఖప్రాప్తిదముగదా? మఱియు

ఉ. వీరును వారు పండితులు, ♦ విక్రమవంతులు బాహుగర్వమ
ర్వారులు లోన రిక్తబవ ♦ రంబున నారడిఁ జావఁబోవ నె
ట్లూరకయుండ బోలు గదు ♦ కొప్పడి మేనులు వాఁడి కైదువుల్
గూరగ నాటినం బుషిమి గుంలుట కక్కట యోర్వవచ్చునే?

కనుక నీయిరువాయివారిలకుఁ బవరంబుగాని తెలంగాలోచింపుము. మఱియు

గీ. పాండుపుత్రులు పండ్రి నచ్చిన ♦ ఎగ్రిటలు వారి
సరసి పోత్రిచితి సైశవ ♦ మాదిగాఁగ
నడుమ నిష్కారణమదిగ ♦ విడువదగునె?
పార మొందంగ రక్షింపు ♦ గౌరవమున.

కర్ణు:—వాసుదేవా! దూతకార్యము నెఱపవచ్చిన నీవు నీపని యేదో జూచుకొనక నాత్మజనస్తుతియు పరనిందయుఁ దలపడెద వేమి?

భీష్ము:—(కోపముతో) రాధేయా! అవినీతివిధేయా! ఈమహాసభారంగమున నిందరు మహాజను లుండ ధర్మోద్ధారకుఁడగు శ్రీకృష్ణుని పల్కులకు నీకింత దుడుకేల రావలయును? అనేకప్రసంగము గావింపక వాయిగట్టి యూరకుండుము.

ద్రోణు:—సూతకుమారా! శ్రీకృష్ణుఁడు మాత్రమాట యటుంచి సి సభారంగమున యుపస్థితులుగా మాట్లాడుట కేమి యధికారము గలదో తొలుత వచింపుము.

కర్ణు.—(సగర్వముగా) ద్రోణాచార్యా! ఆముసలిగ్రస్త భీష్మునితోపాటు నీవును తలయూఁచు చుంటివా?

౧. కాదు గురుయు పహాస్చి ♦ గురువులంచు
చాలకాలమునుండి మి ♦ మ్మేలుచున్న
రాజరాజు నియోదివ ♦ రాజకందు
పరుసముల నాడ విని యోర్వ ♦ సరవె మీకు?

అశ్వ:—కర్ణ! నీచకులసంజాతా! అసంబద్ధప్రలాపా! నీవు నొక పరాక్రమవీరునివలెనే సభారంగమున దలయెత్తి మాటాడుచుంటివా! చాలు చాలు! శాంతిల్లుము.

కృపు.—కర్ణా! దుర్యోధనునిచే నంగరాజ్యాభిషేకము గాంచితి నని సంతసింపఁబోకుము.

౨. స్వల్పుకన్ను చే దెచ్చి ♦ నకులదిశలు
తాఁడు వాడగిన్న యొంతగా ♦ ధర కిగిస్సి

యెన్ని పుణ్యనీరములందు ♦ యెన్నిగతుల
మునిఁగిన నగునె దా గోవు ♦ మూఢబుద్ధి.

కర్ణు:—ఓరీ! కృపాచార్యా! ఏమి నీపరిగల్భములు? నీకంటికి నే నంత పేలవంబుగా గనబడుచుంటినా? యోగికాదుకొనుము చూతము. నీపరిభాషణము. (అని వి ల్లెక్కుపెట్టి లేచి)

గీ. ఓరి! కృపుడా! మదీయశౌర్య ♦ ముద్ధతీవు
కొంచపుం బుద్ధి దెలియంగఁ ♦ గొలఁగిగాని
నోరి కొచ్చినట్టుల పేలి ♦ కోరి సాహ
సస్ఫురత్వ మున్న రణము ♦ సలుపు తెలియు.

(౩ వ అనుబంధము)

నార:— (తనలో) ఆహా! నాకు కావలసినంత కలహభోజనము మునుమున్ను కౌరవపాండవ సంగ్రామావసరమున లభింపగలదు. ఇప్పట్టున వీరలను శాంతివచనంబులఁ జల్లపరచి భావికలహమహావృక్షమున కుద్భటబీజము నాటుదును. (ప్రకాశముగా) కర్ణా! ఏకపక్షాభిమానులగు మీరు మీలో యొండొరుల సహకారిణులై రాజలము రగుల్చుకొనియెదరు? రానున్న మహాసంగ్రామమున మీ యెల్లరును రారాజునకు సహాయపడి మీ మీ బాహువిక్రమంబుల గనుబరుపవచ్చును. కావున ప్రస్తుతము శాంతింపుడు.

దుర్యో:—నారదా! చక్కగా వచించితివి. కురువృద్ధమహాజనులారా! నారదహితోపదేశము లాకర్ణించి శాంతచిత్తులు గండు. (కర్ణునితో) కర్ణా! అంగరాజా! శాంతింపుము.

ఉ. ఎందుల కీవివాదముల ♦ నిమ్మెయి స్వార్థ వహించియోల యూ
తొందరపాటు, కార్యము వి ♦ ధాన మెఱింగి ప్రవ గనంబులో

ము వారిదని యూరకుంటిని. పితామహుఁడగు భీష్ముఁడును, గురువగు ద్రోణాచార్యుడు పలుమారు చెప్పిచెప్పి ఫలము గానక నాపైని కినిడ నాఁడుకొనిరి అయిన నింకొకమారు నీయెదురుగా చెప్పెదను. (దుర్యోధనునితో) తండ్రీ! సుయోధనా!

మ. తనయా! నాపలు కాదరించి వినుమా ♦ దర్పంబు పూనంగ రా
దనయంబున్ కుటిలాత్ములం గలసి స ♦ ద్వ్యాపారపారాయణుల్
గుణులౌ పాండవపంచకంబునకు స ♦ క్రోధంబున న్నెగ్గు సే
యన చింతింపక వారిపాలు ధరణిన్ ♦ యర్పింపు మిష్టంబుగన్.

(4 వ అనుబంధము)

విదు:—కుమారా! గాంధారేయా! నీ రాధేయుఁ డగ్నికి వాయువుంబోలె వల్లమాలిన బీరంబులు పలుకుచు నిన్ను యుద్ధప్రియోన్ముఖుని గావించుచున్నాఁడు. నీ వాతని సూతిగాఁగొని పై తెక్కలాడుచున్నావు గాని నేఁగిఁ దలంపకున్నావు. పాండవులను సామాన్యులుగాఁ దలంపవలదు. వారు దైవసహాయమున విజయారంభులు. మఱియు వారనంతసైన్యసన్నాహంబున గండుమీఱి యున్నారు గాని నీ వనుకొనినట్లు నీరసంబుగా లేరు. వారి బలౌద్ధత్య మెఱింగించెద నాలింపుము.

సీ. శౌర్యోజ్జ్వలుండు పాం ♦ చాల భూనాథుండు
మహితవిక్రముఁడగు ♦ మత్స్యవిభుఁడు
సధికధైర్యాస్పదు ♦ లతనితనయు లుదగ్ర
తేజస్కులైన త ♦ దీపసుతులు
సన్నదమ్ములు ప్రతా ♦ పోన్నతులేవురు
కేకయపతు ల ♦ క్షీణబాహు

శ్రుతాయుష్మంతుడు జరా ♦ సంధసూనుడు సహ
దేవుండు నాజయు ♦ త్సేనవిభుడు

గీ. వినుము శిశుపాలతనయులు ♦ వీరధనులు
ధృష్టకేతుండు వృషభుండు ♦ దీవ్రిరణవి
నోదియదుభర్త చేకితా ♦ నుండు దర్ప
ఘనుడు శైబ్యనృపాలుండు ♦ గలరు సుమ్మ.

జమ:—దుర్యోధనా! నాపలుకులు విశ్వసించి వంశవర్ధనుడవు గమ్ము. శ్రీకృష్ణార్జునులను సామాన్యులుగా దలంపకుము. వారు కేవలము నరనారాయణాంశసంభూతు లింత నిజము. కావున వారలతోడి వైరము నీకు శోభనదాయకము గాదు. తొల్లి నీవలెనే దంభోద్భవుండను నాతడా నరనారాయణులతో దర్పించి యుద్ధతి వాసినసంగతి యొకింత జెప్పెద నాలింపుము.

సీ. వినుము దంభోద్భవుం ♦ డనురాజు దనకెదు
రెవ్వరు లేరంచు ♦ గ్రొవ్వి నరుడు
నారాయణుండను ♦ వారలు గంధమా
దనమనునగమున ♦ దపముసేయ
వారిపై జని యాహ ♦ వమునకు బిలిచిన
నమ్మునీంద్రులు వల ♦ దని యనేక
విధములు జెప్పంగ ♦ వెండియు బోకున్న
గుశముష్టినుజ్వాల ♦ విశిఖవృష్టి

ఆ. వె. గురిసి నరుడు సేన ♦ గూర్చి యాతనిభంగ
పెట్టి పట్టి విడిచె ♦ నట్టి యమ్మ

హాత్ము లిపుడు వర్ధ ♦ డన గృష్ణుడనగ లీ
లార్థకలితజన్ము ♦ లైరసూవె?

కావున పాండవులతోడి విరోధ ముడిగి సౌత్రిభావమున నుం డుట మంచిది పిమ్మట నీయిష్టము.

నార:—దుర్యోధనా! పెద్దల కడ్డు చెప్పుట పాడికాదు. అట్లుం టినిగిదాయని యుద్ధము చేసి నిజపరాక్రమంబు త్రిజగద్వ్యాప్తము గా వింపగోరుట క్షత్రియధర్మము గాదనుట గాదు. నీవు ధర్మ మాలోచిం చి పెద్దలవాక్యములను విమర్శించి కార్యకర్తుడవు గమ్ము.

గాంధా:—నాయనా! సుయోధనా! పెద్దలు వలదన్నపని కుప క్రమింపక నీవు సుఖంబుండి మాయాత్మల కానందము గలిగించుచుం డుము.

మ. తనయా! నీ కిది మంచికాదసనమ ♦ స్వంబ్ధైన సద్బంధులున్
ఘనులుర్ బూజ్యులు నీమతండ్రియును బ ♦ ల్కన్ యెందు కిచ్చట్టి భా
వనమోయీ విను పోని తిక్సిగిదా ♦ వాత్సల్యవిస్ఫూర్తి నే
ననుటన్ బట్టయునైన పంతము విసన్ ♦ న్యాయంబు సత్పుత్రకా!

దుర్యో:—మహానుభావులార! మీమాటలు మన్నింపనందుకు క్షమింపుడు.

క. ఘనులార నన్ను విధియే
మనమును పుట్టించె నట్టు ♦ లయ్యెడుగాకే
విన జవిగాని పలుకులకు
బనిగలదే యుడుగుడింక ♦ బహుభాషణముల్.

కావున నాహిత వాలకించి పాండవులతోడి కయ్యమునకు సిద్ధపడక వారిచుర్ధరాజ్యము వారి కిచ్చి సన్మార్గసంచారుఁడవు గమ్ము.

దుర్యో:—కృష్ణా! యిటు వినుము. నేను బహుభాషణములు పలుకువాడను గాను మఱియు

క. గురుడును బితామహుఁడు నీ
నరనాథుఁడు నెల్ల పోద్రిద్దు నను దూరుదు రి
ప్పరానున నీవును దామో
దర దూరుదుగాని తగవు దలుపవు కంటే?

మఱియు మే మాపాండవపత్నిం బరాభవించితిమనియును, వారిని కానలకు బంపితిమనియు నందురుగాని యది నావలన జరిగినది గాదు అది వారి స్వకీయాపరాధమే.

మ. అరయం దప్పొకయింత నావలన లే దా ధర్మపుత్రుండు జూ
దరివెంటం దమకించి సౌబలునిచే తన్ భూమి గోల్పోయి ము
ష్కరుఁడై వెండియు నోడ్డగా నతఁడు న ష్టపోద్రిష్ఠిమై గెల్చె నే
తెరువై నం దనయిచ్చతోఁ బడియె సం తేకాక యేబూటయే?

కావున మాయం దేనెపమును జూడవలదు. వేయేల? నామనోనిశ్చయ మెల్లరకుం దెలియం జెప్పెద నాలకింపుఁడు.

ఉ. ఏమును వారుఁ బంచికొని యేలుట గల్గదు పల్కెఁ గిందు మిం
కేమియు వాఁడిసూదిమొన యించుక మోపినయంత మాత్రముం
భూమి యొసర్చిపాండునృప పుత్రులకిత్తునె? యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబు గొని రాజ్యము సేయుట నిశ్చయింతిన్.

కర్ణు:—భళి! భళి! రారాజా! చక్కఁగా వచించితివి.

